# బాలమిత్ర

బాలికా బాలురకు దేవు — బాగొనర్చి
లలిని చేకూర్చినయ విద్య — లందలిర్చి
మిథ్యఁ బోగార్చి ధీఁ గూర్చి — మిరఁ దనర్చి
త్రచ్చురహిఁ "బాలమిత్ర" చి — త్రంబమర్చి"

## ఇద్దరు చిన్నపిల్లల విశ్వాసము

ఒక జపాను పోలీసువానికి ఇద్దరు చిన్న కుమార్తెలుండిరి. వారిద్దరు బహు పిరికివారు. ఒకనాటిరాత్రి సేవకులందరు ఇండ్లకు పోయిన పిదప ఆయన, పావుమైలు దూరములోనున్న ఒకరికి కబురుజెప్పగోరెను గాని దానిని తీసికొనివెళ్లగోరువారెవ్వరును లేనందున చాల విచారపడుచుండెను. తాను దానిని తీసికొని వెళ్లుటకు బొత్తిగా వీలులేదు గనుక ఏమి చేయుటకును తోచలేదు. గాని అతని యిద్దరు కుమార్తెలు తాము దానిని తీసుకొని వెళ్లెదమని చెప్పినప్పుడు అతనికి చాల ఆశ్చర్యము కలిగెను. వారి భయమును తీర్చుటకిదే మిక్కిలి మంచి సమయమని వారిని పంపివేసెను. వారు నిర్భయముగా ఒకరినొకరు చేతులు పట్టుకొని వెళ్లి తిరిగివచ్చిరి. వారురాగానే

ఆయన మీకు భయముపుట్టలేదా? అని అడిగెను. అందుకు వారు ‹‹లేదు, నాయినా! భయము పుట్టనేలేదు. ఓషను బడిలో మా పంతులు, ‹దేవుని› మనము మనలను కాపాడు మని అడిగిన యెడల ఆయన కాపాడునని నేర్పెను గనుక మేము వెళ్లకముందు మేడమీదకువెళ్లి ప్రార్థించివెళ్లితి›› మనిరి. ఆ తండ్రి, నా బిడ్డలను ధైర్యవంతులనుగా జేయగలిగిన ఈ మతమును గురించి తెలిసికొనుట తగినదని విచారించి, చివరకు తానును క్రైస్తవుడాయెను.

---

# చిన్న శంబు

శంబు=కొడుకు, మంబు=తల్లి, జంబు=తండ్రి.



శంబు:—(చిరునవ్వుతో) అమ్మా నాకు ఒక చక్కని యెట్టి చొక్కాయిని కుట్టించెదవా?



మంబు:—నాన్నా! నేను సంతోషముగా కుట్టి యిచ్చెదను. ఇదిగో తొడుగుకొమ్ము (అని యిచ్చుచున్నది).



శంబు:—అమ్మా నేను బాగున్నాను. నా
కొక రంగుషరాయి కుట్టియ్యావా?



మంబు:— బాబూ! కుట్టించినానురా వేసి
కొమ్ము.



శంబు:— నాయనా! మాయమ్మ ఒక
యెఱ్ఱని చొక్కాయిని మంచి
షరాయిని కుట్టియిచ్చినది. నీవు
చెప్పులజోడు కొనియియ్యావా?

జంబు:—అయ్యో! నేను బజారువెళ్లి కొని
తెచ్చినాను. తొడుగుకొమ్ము (అని
యిచ్చెను).



శంబు:—(తీసికొని) నాయనా, మరిగొడుగో?

జంబు:—ఇదిగో పుచ్చుకో

**శంబు:**—(అన్నియు వేసికొని, అద్దము చూచుకొని) భళే, భళే,



నేనెంత చక్కని వాడను. ఎర్రసిరాలో ముంచిన బొగ్గువలె నున్నాను. ఇప్పుడు నాతో సాటియైనవా డెవ్వడును లేడు. నాపండ్లంత పొడుగాటిపండ్లు ఎవ్వరికిని లేవు. మరి నా నోరంతపెద్దదికూడ ఎవరికిని లేదు. నా చక్కదన మందరికి చూపుటకు అడవిలోకి షికారు వెళ్లెదను (అని అడవిలోకి వెళ్లగా ఒక పులివచ్చి వాని పట్టుకొని)

**పులి:**—శంబూ! నిన్ను తినబోవుచున్నాను (అనెను).

**శంబు:**—(భయముతో) పులిగారూ! నన్ను తినవద్దండి. నన్ను తినకున్నయెడల నా యెఱ్ఱని చొక్కా నిచ్చెదను.



**పులి:**—సరే ఈసారి నిన్ను క్షమించెదను. ఆ చొక్కాయి నిటిమ్ము.

**శంబు:**—అమ్మయ్యో! ఎట్లాగయితే నేమి పులినోటనుండి నా చావు తప్పించుకొంటిని. ఇక నాలస్యముచేయక త్వరగా వెళ్లుతాను. (అని ఇచ్చి పరుగెత్తుచుండెను. ఇంతలో మరియొక పులివచ్చి)

**పులి:**—ఓరీ కుర్రా! నీ వెవడవురా? నిన్నిప్పుడే తింటాను (అని పట్టబోవుచున్నది).

శంబు:—నేను లేచినవేళ మంచిది గానట్లున్నది. నిద్రనుండి లేవగానే ఏ పాపిష్ఠివాని ముఖమునో చూచితిని. ఎక్కడ జూచినా, నా కిట్టి కష్టములే సంభవించు చున్నవి. (అనుకొని) పులిగారూ! నన్ను చంపకండి. నా చక్కని షరాయి నిచ్చెదను.

పులి:—ఇప్పుడే యిమ్ము (అని వేసికొని) ఆహా, నేనెంత చక్కని దానను. ఎంతటిగొప్పదానను. ఈ అడవి లోని జంతువు లన్నిటిలో నేనే గొప్ప దానను (అని గాండ్రించుచు వెళ్లెను).



శంబు:—ఇప్పటికి రెండు చాపులు తప్పినవి. అబ్బో ఇక ముం దెన్ని సంభవించునో (అనుచు మరికొంచెము దూరము వెళ్లగా మూడవపులివచ్చి)

పులి:—ఆగు. ఆగు. నిన్ను నేను విడువను. నాకు చాల ఆకలి యగుచున్నది. త్వరగారా పట్టుకొని తింటాను.

శంబు:—అబ్బబ్బో! నేను రెండు చాపులు తప్పించుకొంటే మూడవదిమీద తటస్థించినదే. ఇది తప్పక నాచావున కేవచ్చినది. నేనేమిచేయుదును. (అని తలపోసి, పులి గారూ! మిమ్ములను బ్రతిమలాడు కొనుచున్నాను. నన్ను తినివేయకండి. మీకునాయెఱ్ఱని చెప్పులిస్తాను. పుచ్చుకొండి (అని ఇచ్చును).

**పులి:**—వలదు, వలదు. **నాకెందుకు** నీచెప్పులు! నాకు నాలుగు కాళ్లు, నీకు రెండుకాళ్లేగదా. నాకు చాలినన్ని చెప్పులు నీ యొద్దలేవు. గాననిన్ను తప్పకుండా తింటాను. ఇట్లురా!

**శంబు:**—(వణకుచు) పులిగారూ! మీకు రెండు చెవులున్నవిగదా! వాటికివి వేసుకొన్నయెడల బహు చక్కగానుండును.

**పులి:**—సరే ఈసారి నిన్నుతినను (అని వేసికొని) భళే, భళే నేనెంతటి గొప్పదానను. నాకు సాటియైన జంతువు ఇందెక్కడను లేదు (అనుచు వెళ్లెను. కొంచెముసేపటికి మరియొక పులివచ్చి)



**పులి:**—ఓరీ శంబూ! నిన్ను తినబోవుచున్నాను. నాకు కడుపు మండుచున్నవి. త్వరగానడువు. ఇప్పుడే మ్రింగెదను.

**శంబు:**—ఇదేమి కర్మము. ఈదినము మంచిదికాదు. ఈ దినమున మూడుగండములు తప్పించుకొనివస్తే, నాలుగవది కూడా వచ్చెను. నేను బ్రతికి యిల్లు చేరేటట్టు లేదే. ఏమిచేయుదును. (అని వణకుచు) పులిగారూ! నన్ను తినివేయకండి, నా చక్కని ఆకుపచ్చని గొడుగు నిస్తాను. (అని యిచ్చును)



పులి:—ఓరీ కుక్కా! నాకెందుకురా! నీకు రెండు చేతులున్నవి గనుక నీవు దానిని పట్టుకొంటావు. నాకు నాలుగు కాళ్లున్నవి. వాటితో ఎట్లు పట్టుకొనెదను. నాకు గొడుగువద్దు గిడుగువద్దు. నిన్నే తినెదను (అని మీదపడును).

శంబు:—(ఏడ్చుచు) నేనెట్లు వీని నోటినుండి తప్పించుకొనెదను. దీనినోట పడవలయునని యున్నది కాబోలు ఇందుకే ఇచ్చటికి వచ్చితిని కాబోలు. అయ్యయ్యో నావళ్లు వణకుచున్నది. నాకాళ్లు పరుగెత్తలేవు. ఏలాగైనను ఈరోజు నేను చచ్చెదను (అనుచు) పులిగారూ! మీకు తోకయున్నదిగదా మీతోకకు ముడివేసి పైకిఎత్తెదనని (ఉపాయము చెప్పెను).

పులి:—(కట్టించుకొని) ఆహా నేనెంతబాగుగా నున్నాను. నేనొక ఇంటిలో నున్నట్లే యున్నది. ఎంతటి సౌఖ్యము భేష్, భేష్! శంబు నాకెంత మేలు జేసినాడు. పాపము నేను వానిని తినబోతిని. ఈ యడవిలో నాయంత గొప్పదింకేదియులేదు (అనుచు వెళ్లిపోయెను).



## పాట

శంబు:—

పల్లవి:—పిల్లవాడను అడవియందు—ప్రయాణం బెట్టుచేతును
ప్రాణములు భీతిల్లుచుండగ-పరగ నడవిని జూండగా॥



1. పులులువచ్చినన్ను బట్టి-తినబోవుచుండగా:—
భయముజెందియు బట్టలన్నియు — ఇచ్చివే
యుచుంటిని ॥ పి ॥

2. దుస్తులన్నియు పులుల నోట—బెట్టిచేతులు
గడిగితి—అయ్యో యమ్మా కొట్టునేమని-భీతి
జెందుచుంటిని ॥ పి ॥

3. కొండచఱియలలోను గుండె — తడవులాడుచుండగా —
గుండెఝల్లుఝల్లుమనుచు—గుబులుగుడుచుచుండెను ॥పి॥

4. ఎలుగుబంట్లు పెద్దపులులు — ఎగురుచుండెడు కోతులు —
ఒళ్లు ఝల్లుఝల్లుమనుచు—వణకిపోవుచుండెను ॥ పి ॥

అయ్యయ్యో! చెప్పులు, గొడుగు, షరాయి, చొక్కాయి,



అన్నియు పులుల పొట్టనుపెట్టి నీళ్లుపోసితిని. ఇట్లాయింటికిపోతే, మాయమ్మ కొట్టును, మా యయ్య యింటికి రానియ్యక బయటకు వెళ్ల కొట్టును. ఓ యమ్మో! మరల పులుల కేకలు వినబడుచున్నవి (అని వెనుకకుచూచి) అదిగో పులులన్నియు



చొక్కాయి, గొడుగు, షరాయి చెప్పు లన్నియు ఒక చోటబెట్టి పోట్లాడుచున్నవి. నేను మెల్లగావెళ్లి నా వస్తువులన్నియు తెచ్చు కొంటాను. (అని వెళ్లి తెచ్చుకొని) ఇక బుద్ధి వచ్చినది. ఇక ఎప్పటికి అడవికి రాను, రాను, రాను (అని చెంపలువేసికొని)



5. పులులు గుఱ్ఱుగుఱ్ఱుమనుచు — ధ్వనులు
జేయుచుండగా = గుబులుగుబులు మను
చునాకు—గుండె బగులుచుండెను ॥ పి ॥

6. గంతులను వేయుచు నేను— దుస్తులన్నిటి
వేసెదక = సంతసంబున పరుగులిడుచు-
వెళ్లి ఇల్లుచేరెదక ॥ పి ॥

---

# బైబిలు పిల్లలు

## ఏనోషు

పిల్లలారా! మనము మరియొక నూతన సంవత్సరము నందు ప్రభువు దయవలన ప్రవేశించి యున్నాము. గతవత్సరము మనము పొందిన మేళ్లకై ప్రభువును స్తుతించుచు బ్రతుకుదము.

ఇప్పుడు సేతు మునిమనుమడగు ఏనోకు అను బాలుని గూర్చి నేర్చుకొందము. ఈ పత్రిక చదువరులందు ఎంతమంది "ఏనోకు" అను పేరుగలిగి యున్నారు? అట్టి మీరంతా మన ఏనోకువలె మంచి నడతగలిగియున్నారా? ఏనోకు విధేయబాలుడు; నీతిపరుడు; సత్యశాలి; పవిత్ర హృదయుడు; విశ్వాసపరుడు. హెబ్రీయులకు వ్రాయబడిన ఉత్తరము 11-వ అధ్యాయములో "విశ్వాసమునుబట్టి ఏనోకు మరణము చూడకుండునట్లు కొనిపోబడెను...... దేవునికి ఇష్టుడై యుండెనని సాక్ష్యము పొందెన"ని వ్రాయబడలేదా? మన రక్షకుడగు యేసయ్య తమ్ముడగు యూదా తన పత్రికయందలి 14, 15-వ వచనములలో చెప్పినది చదివిచూడుడు.

ఏనోకు ఆదాము వెనుక ఏడవతరమువాడు. అప్పటి ప్రజలు దైవభయము వదలి భక్తిహీనులై దుష్టులై ప్రవర్తించు చుండిరి. దీనిని, మంచివాడైన మన యేనోకు కనిపెట్టి, వారిని చెడ్డనడతను వదలిపెట్టుడని హెచ్చరించుచు, "తీర్పుచేయుటకు ప్రభువు తన వేవేల పరిశుద్ధుల పరివారముతో వచ్చెన"ని వారిని బెదరించెనుగదా?

మనలో నెంతమందిని, మనతోడివారి యొక్కయు, బంధుమిత్రుల యొక్కయు తప్పులు చూచియు చూడనట్లు నటించుచున్నాము. మనము నిజముగా ఇతరుల మేలు గోరితి

మేని వారు బాధపడునట్లు వారి నేరములను వారికి జూపి వారిని మంచి మార్గమున నడుచునట్లు చేయుట మన విధి గదా? "పాపమునకు జీతము మరణము" అని మనము నేర్చుకొన లేదా? ఏనోఖునకు ఈ భయంకర జీతము ఇయ్యబడలేదు. చావకయే స్వర్గమున ప్రవేశించినవాడు. ఆహా! ఇతడు ఎంత ధన్యుడు! మూడువందల ఏండ్లు ప్రభువుతో నడిచెనని వేద గ్రంథమున చెప్పబడియున్నది. దినమంతటిలో అధమపక్షము అరగంట అయినా ప్రభువుతో సహవాసము చేయుచున్నావా? లేదా నీ బ్రతుకువలన నేమి ప్రయోజనము? సారములేని ఉప్పువలె బయట పారవేయబడుదువు జాగ్రత! దైవానుగ్రహముచేత మనమీ నూతనవత్సరమున ప్రవేశించితిమే; గతవత్సరపు జీవనమునకన్న మరీ మంచి జీవనము జీవింప తీర్మానము చేసికొని, తీర్మానించుకొన్న రీతిని నిజముగా ప్రవర్తించితిమేని, ఏనోఖువలె దినమంతా "ప్రేమనిచ్చెన" పైకి దినక్రమేణ ప్రాకి పరలోకమున ప్రవేశించగలము.

# ప్రకృతి పాఠములు

### 6-వ పాఠము

## పువ్వులమీద బ్రదుకునవి

మనము చూచి యానందించుటకైయే ముఖ్యముగా పువ్వులు చేయబడినవని తలంచుచున్నామేమో. మన పరమ తండ్రి వాటి కనుగ్రహించిన సౌందర్యమును ఆకార

భేదములను జూచినప్పుడు ఆలాగే తలంచుదుముగాని ఇదిమాత్రమేగాక పుష్పాలింకా అనేకమైన వాటికి ప్రయోజనకారులై యున్నవి. అనేక చిన్నచిన్న ప్రాణులు ఈ పుష్పాలనుండియే తమ యాహారమును సేకరించుకొనుచున్నవి.



పుష్పాలచుట్టును జుమ్మని ముసురుకొనుచుండు అనేక పురుగులను మీరప్పుడప్పుడు చూచి యుండవచ్చును, వానిలో ముఖ్యమైనది తేనెటీగ. ఇవి పుష్పాలు వికసించిన కాలములో మహా పనిగలిగి ఒకపుష్పమునుండి మరియొకదాని కెగురుచు, ప్రతిదాని నుండియు కొంచెము కొంచెము తేనెను తీసికొనుచుండును. అది తాను మోసికొని పోగలిగినంత పోగుజేసిన పిదప తేనెతుట్టెలో దానినుంచుటకై పోవును. దీనివంటి వనేకములు జేరి, పెద్ద పెద్ద తుట్టెలను పెట్టును. తేనెతో పాటు ఇవి పుష్పాల నుండి, వానిలోనుండెడి ఒక విధమగు పొడినిగూడ తీసికొని పోయి, దానితో తమ తుట్టెలలోని గదుల గోడలను బహు అందముగా గట్టును. దీనికే మైనమని పేరు.

ఇవి మాత్రమేగాక ఎగురునప్పుడు జుమ్మని ధ్వనిచేయుచు, పుష్పాలపై వ్రాలునప్పుడు నిశ్శబ్దముగా నుండుచు, పుష్పాలెంతలోతుగానున్నను ధైర్యముగా లోనికిబోవుచు, నల్లని

రూపముగల తుమ్మెదలును, పుష్పాలలోని మకరందమును త్రాగి జీవించును. ఈ తుమ్మెదలు. పుష్పాలు చిన్నవైన యెడల, తమ తుండములను చాపి ఆ పుష్పాలను చీల్చి మకరందమును త్రాగును. ఇవి ఒక తరహా పుష్పాలపై వ్రాల నారంభించిన యెడల, ఇతర పుష్పాలపై వ్రాలక, అదే రకపు వానిమీదనే యెగురుచుండును. తరువాత ఇతర జాతిపుష్పాలపై వ్రాలుచుండును.

నానావిధ రూపములుగల చక్కని సీతాకోక చిలుకలును



పుష్పాలలోని మకరందమును త్రాగి జీవించును. ఇవి ఒక పుష్పమునుండి మరియొక దానిపై కెగురుటను జూచుట బహు వింతగానుండును. చిన్నవియు, పెద్దవియునను భేదములేక అన్నియు, తాము జీవించిన స్వల్పకాలములోనే పుష్పవన సంచారమునుజేసి ప్రాణములనువిడుచుచున్నవి. పుష్పాల తోటలలో నిట్టి పురుగు లెగురుట జూచుట కెంతో మనోహరముగా నుండును.

జిల్లేడుచెట్టు నెప్పుడైనను గమనించి చూచిబిరా? దానికి పూతపట్టినప్పుడాపువ్వులపై నేమియుండునో చూడుడు.



చీమలకును పువ్వులనిన బహు ప్రీతి. అనేక రకముల చీమలును పువ్వులతో తమ యాహారము వెదకికొనును. ఇవి మాత్రమేగాక ఇంక అనేక రకముల పురుగులు, చిన్నచిన్నవి పువ్వులలోని మకరందమునే తమ కాహారముగా జేసికొని వాటి నాశ్రయించి బ్రదుకుచున్నవి. ఒక ఫ్రెంచిదేశపు శాస్త్రజ్ఞుడు మూడువారములలో నొక పూలచెట్టు మీదకు ముప్పైయేడు వేరువేరు రకముల పురుగులు వచ్చినట్లు గని పెట్టెను. ఇవి మాత్రముగాక పక్షులలో మిగుల చిన్నదియగు హమ్మింగ్ పక్షికూడ యిదేలాగు పువ్వులపై బ్రదుకుచున్నది.

# బాలమిత్ర టపా




ప్రియపిల్లలారా!

ఒకనాటి ప్రొద్దున ఒక బ్రాహ్మణుడు ఒక యూరినుండి మరియొక యూరికి బోవుచుండగా దారికడ్డమున ఒక నది యుండెను. అతడా నది దాటవలసి వచ్చెను. ఆ నదిలో ఒక పడవ యుండెను. అతడా పడవనెక్కి ఆ పడవ నెట్టెడి పల్లెకారితో మాటలాడుచుండెను. బ్రాహ్మణుడు "నీకు వృక్ష శాస్త్రము వచ్చునా" అని యడిగెను. అప్పుడా పల్లెకారి "నాకేమివచ్చునయ్యా నేను పడవలను నెట్టుకొని బ్రతికెడి

వాఁడను. నాకు రాదండి," అని చెప్పెను. "ఓరి వ్యర్థుడా నీవు నీ జీవితకాలములో సగము కాలమును వ్యర్థముగా పోగొట్టుకొంటివి, నీకు జంతు శాస్త్రము వచ్చునా" అని యడిగెను. "అదికూడ నాకు రాదండి" అని మొదట చెప్పినట్టుగా చెప్పెను. ఇంతలో పడవ నడియేటిలోనికి వచ్చెను. అప్పుడొక గొప్ప తుపానురాగా పల్లెకారి పడవమీదనుండి దుమికి ఈదుకొని పోవుచుండగా, బ్రాహ్మణుడు "ఓ పల్లెకారీ నన్ను విడిచి వెళ్లుచున్నావే! అని యడిగెను. అందుకా పల్లెకారి 'నీకు ఈత' అనెడి శాస్త్రము రాదాయేమి?" అని యడిగి, వానిని సురక్షితముగా ఒడ్డుజేర్చెను.

లోకములో మనకు శాస్త్రములన్నియు వచ్చినను రాక పోయినను స్వంత దేహమును రక్షించుకొనెడి శాస్త్రమును మాత్రము నేర్చుకొని యుండవలయునని నేర్చుకొనవచ్చును.

ఇట్లు
కే, యేసురత్నము
మూడవతరగతి, బ్రాంచ్‌స్కూలు, గుంటూరు

C. L. S. PRESS, MADRAS—1915